# భక్తశిఖామణులు

## పాటల పేటిక




కవిశిరోమణి
ఆచార్య రావికంటి వసునందన్

## Bhakthashikhamanulu

by *Kavishiromani*

**Prof. Raavikanti Vasunandan**



**Prof. Raavikanti Vasunandan**
Dr.B.R. Ambedkar Open University
Road No.46, Jubilee Hills, Hyderabad-33.
Cell: 9849852182

First Edition: **2010**

Price: **Rs. 40/-**

Cover Design: **M. Ramesh**

*For Copies:*
**All Branches of Vishalandhra**

*Printed at:*
**Vipla Computer Services**
*(Designers & Multicolour Offset Printers)*
Nallakunta, Hyderabad - 500 044.
Ph.: 2765 4003, 2767 6910, 27677078

సౌజన్యమూర్తి సాంస్కృతికవిస్ఫూర్తి
మాన్యమిత్రులు



శాంతా బయోటెక్నిక్స్ అధినేత
పద్మభూషణ్ డా. కె.ఐ. వరప్రసాద్ రెడ్డి

**ఆ**త్మీయంగా ఈకృతి స్వీకృతికి అంగీకరించిన ఆస్తిక శిరోమణులు, ప్రముఖ పారిశ్రామికవేత్త, మాన్యమిత్రులు పద్మభూషణ్ డా. కె.ఐ. వరప్రసాద్‌రెడ్డి గారికీ

**అ**మితానురాగంతో ఈ భక్తశిఖామణులకు అభినందన చందనం అలదిన పరమాప్తులు లలిత సంగీత చక్రవర్తి, కళారత్న డా.ఎమ్ చిత్తరంజన్ గారికీ

**కృతజ్ఞతాభివందనములు.**

- వసునందన్

# అభినందన చందనం

లలిత గాంధర్వ కళానిధి
లలిత సంగీత చక్రవర్తి
ఆం.ప్ర. ప్రభుత్వ కళారత్న పురస్కార గ్రహీత
**డా. మహాభాష్యం చిత్తరంజన్**

భగవద్భక్తి మానవుని త్రికరణాలను పునీతం చేసి పరమాత్ముని నిజధామమునకు చేర్చే దివ్యసాధనము. భక్తి నవవిధములుగా వుండునని చెప్పబడినది.

**శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్**
**అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్**

శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం – అని తొమ్మిది విధాలుగా భక్తిని పేర్కొన్నది శాస్త్రము. వీటిలో ఏదైనా ఒక పద్ధతిని నిరంతరం అభ్యసించి తరించవచ్చును మానవుడు. అలా ఎంతో మంది మహాభక్తులు, ఋషులు, యోగులు మున్నగువారు పరమాత్మను దర్శించి ముక్తి పొందినవారు అనాదిగా యీ పవిత్ర భారతావనిలో వెలసి మనందరికీ మార్గ దర్శకులైనారు, ఆదర్శ మూర్తులైనారు.

**పరమేశ్వర పాదపద్మ పరమసక్త దివ్యాత్ములు**
**పరమభక్త భృంగవరులు పరమపతిత పావనులు**

అంటూ భక్తవరులైన "ఎందరో మహానుభావుల"ను తగురీతిని కొనియాడినారు మిత్రులు కవిశిరోమణి ఆచార్య రావికంటి వసునందన్ గారు. ఇది కీర్తన పద్ధతి.

**భక్తశిఖామణులు** అను యీ సుందర గేయకావ్యమునందు భారతీయులచే సదా ఆదరించబడుతున్న సుప్రసిద్ధ మహా భక్తులలో కొంతమందిని ఎంపికచేసి వారిపై రచించిన యీస్తుతి గీతాలు పరమరమ్య రసగుళికలు. శివ కేశవ భక్తులు యీ కావ్యములో కీర్తించబడినారు.

**నారాయణ గానామృత నాదమయుడు వేదమయుడగు** నారదుడు ధ్రువుడు, ప్రహ్లాదుడు మున్నగు వారికి గురువై వారిని తరింపచేసిన దివ్యాత్ముడు. త్రిలోక సంచారియైన ఆ మహర్షి లేని పురాణమేలేదు అని అంటే అతిశయం ఏ మాత్రము కాదు. అంతటి దివ్య చరితునితో పాటు ధ్రువుడు, ప్రహ్లాదుడు, మార్కండేయుడు మున్నగువారి మహితోన్నత జీవన విధానములను హృద్యంగా ఆవిష్కరించారు కవి.

పరమగురువు నారదునే భక్తి మించు భాగ్యశాలి

స్థావరముల జంగమముల తనలోపల నితరులలో
నిరతము హరియునికి నెంచి నిత్యస్మృతి నిలుపువాడు

తన అకుంఠిత భక్తితో హరిని నృసింహరూపునిగా అవతరింపజేసిన పరమభక్త శిఖామణి ప్రహ్లాదుడు. గురువైన నారదునే తన అపారమైన భక్తితో అధిగమించి, "ప్రహ్లాద నారద పరాశర పుండరీక..." అన్నట్లుగా భక్తకోటిలో ప్రథమ స్థానాన్ని పొందిన ఘనుడు ప్రహ్లాదుడు.

రోమరోమంలో రామ నామాన్ని నిలుపుకుని **జయ జయ రామా! జయ శ్రీరామా!** అని సతతమూ గానం చేసే శివాంశసంభవుడు హనుమంతుడు. రామభక్తికి ఆదర్శంగా నిలిచిన మహిమాన్వితుడు.

ద్వాదశీవ్రత గరిష్ఠుడు ధర్మాత్ముడు విశిష్టుడు
హరి పద సేనా నిరతుడు మహాభక్తుడైన అంబరీషుడు.

అదే విధంగా

అతని రీతి ఏకాదశివ్రతము నెల్ల రాచరింప
పాపాత్ములు లేక యముని పట్టణమే మూతపడెను

అని కీర్తించబడిన రుక్మాంగదు డెంతటి భక్తి తత్పరుడో!

శివభక్తులైన కన్నప్ప, అమ్మవ్వ కీర్తిబడసిన బెజ్జమహాదేవి, గొడగూచి, నందనారు, చిరుతొండనంబిల దివ్య చరితల విశిష్టతలను ఆచార్యవసునందన్ వర్ణించిన తీరు చదువరులను అమితంగా ఆకట్టుకుంటుంది.

తెలియవు శౌచము తపస్సు తెలియవు శమ దమములు
తెలియవు వేదములు శాస్త్ర దీప్త పురాణములు అని,

ఆత్మలోన పరమాత్ముడు ఆడిపాడుతుంటే
అందుకు కన్నప్పే ఒక అత్యద్భుత సాక్ష్యం

అంటూ అమాయకుడైన కన్నప్ప యొక్క అచంచలమైన భక్తిని ఎంతో మనోహరంగా కొనియాడారు.

శివునికమ్మలేదని శివుని కవ్వలేదని
శివుదేతన కొడుకని సేవించిన అవ్వ



లాలపోసి పాలు పట్టి జోల పాడెనమ్మ
కురులుదువ్వి విరులుముడిచి కూర్మి సాకెనవ్వ

అమ్మవ్వగా కీర్తిగాంచిన బెజ్జమహాదేవి, నిర్మలమైన మనస్సుతో పరమశివుని తన కుమారునిగా తలచి అమితప్రేమతో లాలించి అల్లారుముద్దుగా సాకిన ఆ మాతృమూర్తియే వాత్సల్య భక్తికి చక్కని తార్కాణం.

పసితనం నమ్మకం పరమ భక్తి రూపమని
నిటలాక్షునినమ్మి కొలిచి నిరూపించె గొడగూచి

ఏమాలిన్యములేని స్వచ్ఛమైన మనసుతో పరమేశ్వరుని కొలిచి, ఆవుపాలను శివలింగముచే త్రాగించిన ఘనత మహాభక్తురాలైన గొడగూచిదే!

భక్తికి కులమేమని భక్తికి స్థలమేమని
భక్తియె సర్వస్వమని భవుని కొలిచె నందవారు

చిదంబరంలోని నటరాజ స్వామిని తనివితీర కొలిచి తరించిన మహాత్ముడు నందనారు.

భజగోవిందం బ్రహ్మానందం భవనాశకరం శంకరం
అద్వైతామృత వర్షిణం ఆత్మానంద దర్శనం

అని అద్వైతమత స్థాపకుడైన ఆదిశంకరాచార్యుల వారి ఆత్మవిద్య యొక్క సచ్చిదానంద తత్త్వం భవనాశకరమని బ్రహ్మానందమయమనే సత్యాన్ని చాటే అమృతవాక్కులివి.

అలాగే

దయారసము కురియు కనుల శ్రియఃపతిని లోకములకు
పట్టియిచ్చు రామానుజ పరమగురువు పరంజ్యోతి

సకల జనులు ముక్తిని పొందాలనే అమితప్రేమతో ఆలయగోపురము పైకెక్కి రహస్యమైన తిరుమంత్రమును అందరికీ అందించిన పుణ్యమూర్తి విశిష్టాద్వైతప్రవక్త భగవద్రామానుజాచార్యులు-ఆయనను పరమగురువు పరంజ్యోతి అని కీర్తించారు కవి.

గీతగోవింద రీతుల పొంగే
భక్తి వేదాంత ముక్తి రసగంగ
కృష్ణతత్త్వమును కూలంకషముగ
అందజేసెను అమరగానమున

సంస్కృత గేయ కావ్యమైన గీతగోవిందమును అష్టపదులుగా వెలయించి శ్రీకృష్ణ తత్వాన్ని లోకానికందించిన మహాభక్తుడు తొలి భారతీయ వాగ్గేయకారుడు శ్రీజయదేవుడు. ఒరిస్సా, బెంగాల్ ప్రాంతీయులే కాక భారతీయులందరూ ఎంతో భక్తిశ్రద్ధలతో అపురూపంగా గానం చేసే యీ అష్టపదులతో అజరామరంగా నిలిచి ఆత్మపరమాత్మ సమైక్యతను తెలిపే దివ్యకావ్యంగా వాసికెక్కినది గీతగోవింద కావ్యము.

ఆముక్తమాల్యదయైన శ్రీగోదాదేవిని గూడ

**కుడి కొప్పున - నెక్కొను మహాభక్తి**
**తిరుప్పావు పాశురములు పాడిన**
**క్రమ గాంధర్వ గాన విశారద!**
**వందనములుగొనుమా ఆండాళ్!**

అంటూ ముదమార కీర్తించారు ఆచార్యులవారు.

పదకవితా పితామహులు, సంకీర్తనాచార్యులు అయిన అన్నమాచార్యులు దక్షిణాది తొలి వాగ్గేయకారునిగా ప్రసిద్ధి గాంచినారు. తిరుమలేశుని అపారమైన తన కవితా ధారలతో అనన్య సామాన్యరీతిని 32 వేల కీర్తనలతో స్తుతి చేసిన పరమ భక్తాగ్రేసరులు.

**బ్రహ్మమొక్కటే పర బ్రహ్మమొక్కటే**
**అనిచాటిన అద్వితీయ భక్తుడన్నమయ్య**

అని వినుతించారు కవి శిరోమణి వసునందన్ గారు.

తత్పూర్వ వాగ్గేయకారులైన రామదాసు, క్షేత్రయ్య, త్యాగయ్య, ఆ తరువాతి పురంధర దాసు, సూరదాసు మున్నగు వారిని సైతం సముచిత రీతిని కొనియాడారు కవి.

వీరేకాక ఉత్తర భారతాన ఉద్భవించిన మహాభక్తులు మీరాబాయి, సంత్ తుకారామ్, సతీసక్కుబాయి; హిందూ ముస్లిం మతాలకు వారధి వంటివాడు, అల్లాను, రాముడిని సమానమైన భక్తితో కొలిచే మహాభక్తుడు కబీర్‌దాస్; తులసీదాస్, శ్రీ వేంకటేశుని భక్తురాలు తరిగొండవేంగమాంబ మున్నగువారిని కూడా ఎంతోఘనంగా కీర్తించినారు శ్రీవసునందన్.

ఇంతమంది "భక్తశిఖామణుల"ను అపారమైన శ్రద్ధా భక్తులతో సంస్తుతి చేసి తద్వారా వారి వారి విశిష్టతలను బహు సుందరమైన రీతిలో తెలుపుతూ తమ యీ గేయ మాలికను సృజియించిన ధన్యులు శ్రీవసునందన్‌గారు. వారి ఈ మృదుమధుర సుమ పరీమళ గేయమాలికకు యిదే నిండుమనసుతో నా అభినందనచందనం.



# కవిశిరోమణి ఆచార్య రావికంటి వసునందన్



జననం : 04.05.1949

జన్మస్థలం : కమాన్‌పూర్
కరీంనగర్ జిల్లా, ఆంధ్రప్రదేశ్

తల్లిదండ్రులు : కీ.శే. శ్రీమతి జగ్గమాంబ, శ్రీ కిష్టయ్య

విద్య : ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి

ఉద్యోగం : తెలుగు ప్రొఫెసర్
ప్రిన్సిపల్ ఇన్వెస్టిగేటర్, యు.జి.సి. మేజర్ రీసర్చ్ ప్రాజెక్ట్
డా. బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

## రచనలు

### కథా కావ్యాలు

రతీప్రద్యుమ్నము (గద్య కథాకావ్యం - 1971)

గురుకులము (విమర్శనాత్మక గద్య కథాకావ్యం - 1978)

భారతం (పద్య కథాకావ్యం - 1980 - డా॥ దేవులపల్లి కృష్ణశాస్త్రి
స్మారకపురస్కారం పొందిన కృతి)

బలి (గేయ కథాకావ్యం - 1981)

కృష్ణం కలయ... (పద్య కథాకావ్యం - 2009)

అష్టాక్షరి (పద్య కథాకావ్యం - 2009)

కవిశిరోమణి ఆచార్య రావికంటి వసునందన్ పద్యరత్నావళి (2009)

పంచాక్షరి (పద్యకథాకావ్యం - 2010)

## దీర్ఘ కావ్యాలు

త్రయి (1982)

మనస్సు (2004)

పిల్లలమఱ్ఱి (2006)

మట్టిముద్దలు (2007)

ఆయుధం కవిత్వం (2007)

ప్రవాహిని (2008)

భక్తి (2009)

## గేయ కావ్యాలు

శ్రీరామ చరితామృతమ్ (పాటల్లో రామాయణం - 1992)

శ్రీవేంకటేశ్వర తారావళి (సంకీర్తనలు-2005)

ఎందరో మహానుభావులు (జీవిత చరిత్రలు - 2006)

భక్తశిఖామణులు (పాటల పేటిక - 2010)

## సాహితీ విమర్శ - పరిశోధన

భావదీపికలు (సాహిత్య వ్యాససంపుటి - 1980)

భూమిక - ఒక సమగ్ర పరిశీలనం (ఎం.ఫిల్. సిద్ధాంత వ్యాసం - 1985)

అష్టాక్షరి (సినారె కృతులపై సాహిత్య వ్యాసాలు - 1987)

ఆధునికాంధ్ర కవిత్వంలో మానవతావాదం - విశ్వంభర విలక్షణత
(పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం - 1990)

## వచన కవితలు

సాధన (కవితా సంపుటి - 1981)

కలం కదిలితే... (కవితాసంపుటి - 2003)



మెరుపు మెరిస్తే... (కవితా సంపుటి-2004)

వాన కురిస్తే... (కవితా సంపుటి-2005)

నేల నవ్వితే... (కవితా సంపుటి-2006)

మనసు నిండితే... (కవితా సంపుటి-2006)

సింగిణీ మొలిస్తే... (కవితా సంపుటి-2006)

నెమలి ఆడితే... (కవితా సంపుటి-2008)

గుండె పొంగితే... (కవితా సంపుటి-2009)

## వివిధ కృతులు

వేణీ సంగమం (గేయం, పద్యం - 1975)

ప్రజావిజయం (రేడియోరూపకం - 1990)

ప్రయోజన దండకాలు (దండకాలు - 1993)

జైగణేశ్, బాలాజీ (భక్తిపాటల ఆడియో క్యాసెట్స్ - 1994)

లోవెలుగు (ముక్తకాలు - 2004)

రావికన్నులు (సంక్షిప్త కవితలు-2006)

అనుయోగం (త్రిపదులు - 2009)

అడుగడుగునా! (సంక్షిప్త కవితలు-2009)

## బాలసాహిత్యం

బాలజ్యోతులు (పిల్లల కథలు-2007)

బాలబ్రహ్మం (దీర్ఘకావ్యం-2008)

భారతనారీమణులు (పిల్లల కథలు-2009)

## అనువాదాలు

దౌడ్ (హిందీ అనువాదం) డా.ఎం.రంగయ్య (2006)

రెసొల్యూట్ మైండ్ (ఇంగ్లీష్ అనువాదం) డా.బి.రామచంద్రయ్య (2006)

విరాట్ ఏకతా వట్ (హిందీ అనువాదం) డా. ఎం. రంగయ్య (2008)

### ముద్రణలో

మనతెలంగాణ (దీర్ఘకావ్యం)

భావగతం (దీర్ఘకావ్యం)

చంపుడుగుళ్ళు (దీర్ఘకావ్యం)

## పురస్కారాలు

ఎ.పి.ఎ.యు.యస్. సమాఖ్య కడప స్వర్ణపతక పురస్కారం (1982)

డా. దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారక పురస్కారం, హైదరాబాద్ (1982)

శ్రీ జమిలి నమ్మాళ్వార్ స్మారక పురస్కారం, హైదరాబాద్ (1990)

శ్రీ తేరాల జగదీశ్వర్ స్మారక పురస్కారం, హైదరాబాద్ (1993)

శిల్పా ఆర్ట్ క్రియేషన్స్ ఉత్తమ విద్యావేత్త పురస్కృతి, హైదరాబాద్ (1993)

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉత్తమ అధ్యాపక పురస్కృతి, హైదరాబాద్ (2002)

డా. వానమామలై వరదాచార్య సాహిత్య పురస్కారం, కోరుట్ల (2003)

కవిశిరోమణి బిరుదప్రదానం - భారతీ సాహిత్య సమితి, కోరుట్ల (2003)

డా.జె.ఆర్.ఇ.టి.రజతోత్సవస్వర్ణపతక,స్వర్ణకంకణపురస్కారం,జగిత్యాల (2003)

వానమామలై జగన్నాథాచార్య సాహిత్య పురస్కారం, కరీంనగర్ (2004)

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉగాది పురస్కారం, హైదరాబాద్ (2004)

పొట్టిశ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయం ధర్మనిధిపురస్కారం, హైదరాబాద్ (2004)

ఆంధ్రప్రదేశ్ అధికార భాషాసంఘం - భాషావేత్త పురస్కారం, రంగారెడ్డి (2006)

శ్రీ దోమా వేంకటస్వామిగుప్త సాహిత్య పురస్కారం, కడప (2007)

తేజ ఆర్ట్ క్రియేషన్స్, సాహితీ పురస్కారం, హైదరాబాద్ (2007)

భారత పర్యావరణ పరిరక్షణ గవాక్షం - రంగారెడ్డి జిల్లా పురస్కృతి (2008)

తేజ ఆర్ట్ క్రియేషన్స్-ఆచార్య తిరుమల సాహితీ పురస్కారం, హైదరాబాద్ (2008)



## ఎందరో మహానుభావులు...

పల్లవి : పరమేశ్వర పాదపద్మ పరమసక్త దివ్యాత్ములు
పరమభక్త భృంగవరులు పరమ పతితపావనులు ॥పరమేశ్వర॥

చరణం 1 : తమ పుట్టువు వలన జన్మ తాపములను పరిహరించి
తరతమభేదములు లేని తమ కరుణావృష్టి గురిసి
భూమిజనుల నేలుకొనెడి భూతదయామతులు హితులు
కోయని పిలిచిన దయతో నోయను పరదైవగతులు ॥పరమేశ్వర॥

చరణం 2 : దైవమెవరో ఆయన సంస్థానమేదో ఎవరికెరుక?
మన కన్నులు చల్లనగా మనెడి భక్తవరులె గొప్ప!
ముంగిటి ముత్యములు కొంగు ముడిగట్టిన రత్నములు
లోకములను గాచెడి భూలోకచరులు భక్తవరులు. ॥పరమేశ్వర॥

# నారదుడు

పల్లవి : ఏ మహర్షి నాదులలో నిగురొత్తునో స్వరగతులు
అతడే నారదుడు సతత హరికీర్తన తత్పరుడు ॥ఏ॥

చరణం 1 : విరించి మానససూనుడు విగతలోభ మోహగుణుడు
నారాయణ గానామృత నాదమయుడు వేదమయుడు
కమలజాండ సంక్షేమాకాంక్ష పొంగి పొరలువాడు
బ్రహ్మచారి బ్రహ్మతేజ పరిపూర్ణుడు నారదుడు ॥ఏ॥

చరణం 2 : ప్రతిపదమున నారాయణ పదమునె స్మృతి నిలుపువాడు
ఎవరిచెంతకేగినను ఎంతయు నిర్భయకలితుడు
ఏ మాటను మాటాడిన నెంతయు నిశ్చయచిత్తుడు
ఏ పని చేసినను లోక హితమే తలపోయువాడు ॥ఏ॥

చరణం 3 : కరుణమీర ధ్రువునకు సద్గతిజూపిన మహనీయుడు
ప్రహ్లాదుని స్థిరభక్తికి పరమగురువు నారదుడు
అన్ని కథలలోపల తానున్న దివ్య చారిత్రుడు
అందరిలో తానై తానన్ని దిశల తిరుగువాడు. ॥ఏ॥



# ధ్రువుడు

పల్లవి : ధ్రువమైన పౌరుషము దృఢమైన భక్తియును
కలిసి ధ్రువుడై వెలసె కడు విభ్రమముగా ॥ధ్రువ॥

చరణం 1 : పసిబాలకుడు చెక్కు వసివాడనప్పుడే
ఘోరవనములకేగి క్రూరమృగముల నడుమ
ఎండవానలకోర్చి ఎంత తపమొనరించె
దిశలు నివ్వెరచెంద దేవతలు మెచ్చగా ॥ధ్రువ॥

చరణం 2 : నీ మొగమ్మున ప్రొద్దు నిలిచెనా బాలకా !
తండ్రి అంకమునెక్క – తరలిపొమ్మని తిట్ట –
ధర దుర్భరము సవతితల్లి దౌర్జన్యమని
పరితాపమున అడవివంక బోయెను ధ్రువుడు ॥ధ్రువ॥

చరణం 3 : నారదుడు దయనిడిన నారాయణ సుమంత్ర
పారాయణముచేత పరమపావనమైన
ధ్రువతారగా వెలిగె ధ్రువుడు శాశ్వతముగా
తారలకు గ్రహములకు తానె దిక్కగుచు ॥ధ్రువ॥

# ప్రహ్లాదుడు

పల్లవి : ఆగర్బ వైష్ణవుడు అఖిలాత్మ దర్శనుడు
సర్వసమభావనుడు జగతి ప్రహ్లాదుడు ॥ఆగర్బ॥

చరణం 1 : ప్రతి పదమున హరిస్మరణ పొరగుడై పరగువాడు
తల్లి కడుపె తనయోగస్థానముగా తనరువాడు
పరమగురువు నారదునే భక్తి మించు భాగ్యశాలి
అసురులలో హరి విభూతి నందుకొనిన కీర్తిశీలి ॥ఆగర్బ॥

చరణం 2 : స్థావరముల జంగమముల తనలోపల నితరులలో
నిరతము హరియునికి నెంచి నిత్యస్మృతి నిలుపువాడు
లౌకికమునకన్న పారలౌకికమునె తలచువాడు
రాక్షసుడై దైవీగుణ రాశి వాసిగనినవాడు ॥ఆగర్బ॥

చరణం 3 : ఎచ్చటరా విష్ణుడనుచు నెగిరిపడెడి జనకునితో
ఎచటనైన గలడటంచు నెలమిబలికి వినయముతో
స్తంభములో నరహరి విస్రంభమూర్తి బయలు వెడల
కారణమైనట్టి జన్మకారణుడు ప్రహ్లాదుడు ॥ఆగర్బ॥



# మార్కండేయుడు

పల్లవి : కాలగతిని మార్చివేసి కాలయముని శాసించిన
పరమేశ్వర పాదభక్త బాలుడు మార్కండేయుడు ॥కాల॥

చరణం 1 : వరమృకండుముని తపస్సు ఫలమై కలిగిన కొడుకు
చదువులలో సంధ్యలలో సాటిలేని చురుకు
కదిలే అమృతపు మొలక కళలకు జాబిలి తునుక
పిందె వయసులో రాలగ విధి వ్రాయుట చిత్రము ॥కాల॥

చరణం 2 : నారదముని దీవెనతో నటరాజును నమ్మికొలిచి
శివలింగమ్మును గట్టిగ చేతులతో చుట్టివేసి
క్షణమైనను చెదరని పంచాక్షరిగత చిత్తముతో
మృతికె చెమట పట్టించిన మృత్యుంజయచింతనుడు ॥కాల॥

చరణం 3 : శివశివశివ పంచాక్షరి శ్రీమంత్రావరణములో
నిర్భయుడు నిశ్చలుడు నిర్భేద్యుడు బాలకుడు
కాలపాశమునకె వణుకు కలిగించిన తన్మయుడు
తల్లిదండ్రి గర్భశోక తాపమువాపిన ఘనుడు ॥కాల॥

# హనుమంతుడు

పల్లవి : జయజయ రామా! జయశ్రీ రామా!
అని గానము సేయును శ్రీ హనుమ! ॥జయ॥

చరణం 1 : రుద్రాంశమ్మున పవనసూనుడై రోదసినీదిన ఘనుడు విద్యకై
అఖిలదేవతల నిఖిల వరమ్ముల నందుకొనియె ధర్మస్థాపనకై
అంజనీ సుతుడు వనచర ముఖ్యుడు అతులిత వజ్రాంగబలధాముడు
భూత రాక్షస పిశాచవారణుడు సర్వదుఃఖ పరిహారకారణుడు
॥జయ॥

చరణం 2 : భానుని పండని పట్టినవాడు వాయుమనోవేగ వివస్వంతుడు
వజ్రమునీకగ త్రోసిన వాడు భయద నిశాచర సర్వనాశకుడు
రామాయణమాలా నాయకమణి రామచంద్రజీవ సంజీవఘృణి
సీతామాత నయన చింతామణి శ్రీరామపదార్చన నాకధుని
॥జయ॥

చరణం 3 : యత్రయత్ర రఘునాథ కీర్తనం
తత్రతత్ర కృతమస్తకాంజలిం
బాష్పవారి పరిపూర్ణ లోచనం
భావి బ్రహ్మరూపిణం నమామి ॥జయ॥



# భీష్ముడు

పల్లవి : గంగానదీ గర్భ కంజాత భీష్మా!
సకల సంపత్కారి సౌభాగ్య భీష్మా! ॥గంగా॥

చరణం 1 : అష్టవసువుల యంశలందిపుట్టిన మూర్తి
సరిలేని సంత్యాగ సత్యధర్మ స్ఫూర్తి
నిలువెల్ల రూపైన బలుక్షాత్ర విస్ఫూర్తి
శ్రీ విష్ణు పద దివ్య చింతనామృతవర్తి ॥గంగా॥

చరణం 2 : పరశురాముని వంటి వరవిక్రముని గొల్చి
పట్టశక్యముగాని దిట్టతనమున నిల్చి
అఖిలరాజన్య విజయము చేసి రాజ్యమును
సవతిపిల్లల కిడిన సాధుసత్యవ్రతా! ॥గంగా॥

చరణం 3 : కోరికలు, జీవితము, కువలయ పతిత్వమును
తండ్రి సౌఖ్యముకొరకె ధారపోయుటనేమొ
పరమ దుర్లభమైన స్వచ్ఛంద మరణమును
విష్ణునామసహస్ర వినుత కీర్తన గలిగె ॥గంగా॥

## అంబరీషుడు

పల్లవి : హరిపదసేవా నిరతుడు అంబరీష చక్రవర్తి
ద్వాదశీవ్రత గరిష్ఠుడు ధర్మాత్ముడు విశిష్టుడు ॥హరి॥

చరణం 1 : ఎవ్వని సేవానిరతిని ఎంతో మెచ్చి శ్రీ విష్ణువు
తన చక్రము రక్షగాగ దయమీర ప్రసాదించెనో
అట్టి మహామహితాత్ముడు అంబరీషుడు
నిరత విష్ణునామకలిత నిర్మలాత్ముడు ॥హరి॥

చరణం 2 : తన వంశము ధన్యముగా తనపితరులు ధన్యులుగా
తల్లిదండ్రి ధన్యులుగా తన జన్మము ధన్యముగా
తన వారలు ధన్యులుగా తన ధరిత్రి ధన్యముగా
తనరెను ఆ ధన్యాత్ముడు దినదిన వర్ధిష్ణువుగా ॥హరి॥

చరణం 3 : దౌష్ట్యముతో దుర్వాసుడు తనను పరీక్షింపరాగ
అతి భక్తిని పూజించిన అంబరీషుని
అలిగి శపింతుననను మునిని అత్యాగ్రహమున చక్రము
తరిమి తరిమి తరిమి తపో దర్పము పరిమార్చెను ॥హరి॥



## రుక్మాంగదుడు

పల్లవి : కన్నకొడుకు తలనైనను పన్నుగ ఏకాదశికై
అర్పింపగ బూనిన ధన్యాత్ముడు రుక్మాంగదుడు ॥కన్న॥

చరణం 1 : పుట్టుకతో హరిభక్తుడు పూజనీయ గుణయుక్తుడు
కంటిపాపరీతి జనుల కాపాడెడి సమర్థుడు
మహాబలుడు మహాయశుడు మహోన్నతుడు మహాత్ముడు
కన్నుల చల్లని వెన్నెలగాయును రుక్మాంగదుడు ॥కన్న॥

చరణం 2 : అతనిరీతి ఏకాదశి వ్రతము నెల్లరాచరింప
పాపాత్ములు లేక యముని పట్టణమే మూతవడెను
లబలబలాడిన యముని సబలు జేయబూని బ్రహ్మ
అందమ్ముల రాశినొకతె ననిపెను రుక్మాంగదుపై ॥కన్న॥

చరణం 3 : ఐన యెడల మానివేయు మావ్రతమును కాదేని
ఆత్మజుతల దరుగు మనుచు ఆయంగన శాసించిన
చిత్తము దృఢముగ నరపతి ఎత్తిన ఖడ్గము సుమాల
మాలగ వెలుగుచు రాజకుమారుని మెడలో వ్రాలెను. ॥కన్న॥

# కన్నప్ప

పల్లవి : అన్నన్నా! అన్నన్నా! ఎన్నగ కన్నప్ప
ఎన్ని తీర్లకన్నా బల్‌మిన్న కన్నప్ప ॥అన్నన్నా॥

చరణం 1 : ఎందుకు చదువులు సంధ్యలు ఎందుకు శాస్త్రాలు
ఎందుకు పూజలు వ్రతములు ఎందుకు యజ్ఞాలు
ఆత్మలోన పరమాత్ముడు ఆడిపాడుతుంటే
అందుకు కన్నప్పే ఒక అత్యద్భుత సాక్ష్యం ॥అన్నన్నా॥

చరణం 2 : తెలియవు శౌచము తపస్సు తెలియవు శమదమములు
తెలియవు వేదములు శాస్త్ర దీప్త పురాణములు
తొలిప్రొద్దున లేచి జంతువులను చంపితినుటే
కన్నప్పకు తెలిసిన ఏకైక విద్య కాదే! ॥అన్నన్నా॥

చరణం 3 : అంతటి భౌతిక జీవికి అంతటి వనచరునికి
ఎంతటి అసమాంబక ప్రేమైక బుద్ధికలిగె
అమ్మున పెకలించి కన్నుదమ్ములతికి-అతికి
అభవుని మెప్పించిన కన్నప్ప ఎంత గొప్ప! ॥అన్నన్నా॥



# అమ్మవ్వ

పల్లవి : అమ్మలకే అమ్మగా అవ్వలకే అవ్వగా
వెలిగిన అమ్మవ్వ! బెజ్జ మహాదేవి ॥అమ్మ॥

చరణం 1 : శివునికమ్మలేదని శివునికవ్వలేదని
శివుడే తన కొడుకని సేవించిన అవ్వ
లాలపోసి పాలుపట్టి జోలపాడెనమ్మ
కురులుదువ్వి విరులుముడిచి కూర్మి సాకెనవ్వ ॥అమ్మ॥

చరణం 2 : తల్లియున్న దిసమొలతో తరలి తిరుగ గనునె?
తల్లియున్న కాటిలోన తనయుని బోవిడునె?
తల్లియున్న విసముద్రావ తానోర్చునె యనుచు
తల్లిలేని శంకరునికి తల్లియయ్యెనవ్వ ॥అమ్మ॥

చరణం 3 : ఎవ్వడు తల్లియు తండ్రియు ఈ లోకమ్ములకు
అట్టివాని కమ్మయగుచు నమాయకపు భక్తి
ప్రేమించెను లాలించెను బెజ్జమహాదేవి
అమ్మవ్వమ్మవ్వాయని హరుడు మురిసిపిలువ ॥అమ్మ॥

# గొడగూచి

పల్లవి : పసితనం నమ్మకం పరమభక్తి రూపమని
నిటలాక్షుని నమ్మి కొలిచి నిరూపించె గొడగూచి ॥పసి॥

చరణం 1 : శివదేవుని పుత్రిక శైశవలీలా మానస
ఆటపాటలందును స్మరహరునె తలచు బాలిక
పూటకొక్క రీతిగ పెంపొందెడి శశిఖండిక
చదువు సంధ్యలందున సరిసాటిలేని దీపిక ॥పసి॥

చరణం 2 : పొరుగూరికి జనుచు తండ్రి పరమేశ్వర పూజ
నిత్యార్చన సేయుమనుచు నియమించిన గొడగూచి
అతని మాటపై కుంచెడు ఆవుపాలగాచి
త్రావుమనుచు బలిమిసేయ ద్రావసాగె లింగమూర్తి ॥పసి॥

చరణం 3 : తిరిగివచ్చి బిడ్డ జెప్పు తీరు నమ్మలేక
శివదేవుడు రవ్వసేయ శివుని శరణుజొచ్చి
విచ్చిన లింగములోపల జొచ్చె నద్భుతముగ
బొందితోడ కైలాసము బోయెను గొడగూచి ॥పసి॥



# చిరుతొండనంబి

పల్లవి : శివభక్తులందు నచ్చెరువుగా మమతలను
ఛేదించు చిద్ఘనుడు చిరుతొండనంబి ॥శివ॥

చరణం 1 : కంచిపురమునసుదంచిత కర్ముడు
అంచితముగ నివసించు వరిష్ఠుడు
భవతారక మతి వైశ్య శ్రేష్ఠుడు
భవసేవా నిర్వహణ వరేణ్యుడు ॥శివ॥

చరణం 2 : వ్యాపారము సద్వ్యాపారముగా
శివభక్తార్చన వ్యవసాయముగా
అతిథి సమర్చన అతిభాగ్యముగా
జరుప పరీక్షించనెంచె హరుడు ॥శివ॥

చరణం 3 : జంగముడైన యనంగరిపుని సా
పడుమన పుత్రుని పలలమె కోరిన –
సిరియాళుని వండిన చిరుతొండని
భళిభళియని దేవతలు పొగడిరి. ॥శివ॥

# నందనారు

పల్లవి : భక్తికి కులమేమని భక్తికి స్థలమేమని
భక్తియె సర్వస్వమని భవుని కొలిచె నందనారు ॥భక్తి॥

చరణం 1 : అంటరానివాడని తమ దంట నిలువరాదని
పశువుకంటె హీనముగా ప్రతి అడుగున జూచి
కాకి ముక్కుతో పొడిచే లోకమును క్షమించి
తనదారియె తనదిగ శివుదలచు నందనారు ॥భక్తి॥

చరణం 2 : ఎటువైపున నీరందక ఎండి బీడు పడిన నేల
వగచెడి తన గుండెవోలె పగిలి బీటలిడిన నేల
నలుబది ఎకరముల నొక్క నాడె హరుని కరుణచేత
పండించెను పగబట్టిన పాపపు భూస్వామి పొగడ ॥భక్తి॥

చరణం 3 : నిరతము శంభో! శంకర! నీలకంఠ! పరమేశా!
దైవరాయ! అని మదిలో తలచు నందనారు
కదుభక్తిని జగతిగెలిచి కన్నులార గాంచె
రమ్యముగ చిదంబరేశ్వరాది ఆలయములు ॥భక్తి॥



# ఆదిశంకరులు

పల్లవి : భజగోవిందం బ్రహ్మానందం భవనాశకరం శంకరం
అద్వైతామృతవర్షిణం ఆత్మానంద దర్శినం ॥భజ॥

చరణం 1 : గోవిందుని స్మృతి గొప్పదని
భవజలధిని ఒక పడవయని
సర్వస్తవముల శంకరుడు
భక్తినె చాటెను బంగారమని ॥భజ॥

చరణం 2 : అందరు సమమని అన్నీ సమమని
అందరిలోపల నలరు దైవమని
జీవుడందుకే దేవుడనీ
చాటెను దయతో శంకరుడు ॥భజ॥

చరణం 3 : ఏమతి గతియై ఇహపరములకు
దిగ్దిగంతముల దీప్తినందెనో
అట్టి మహాద్యుతి అద్వైతమును
అద్వితీయమని అంతటచాటెను ॥భజ॥

# భగవద్రామానుజులు

పల్లవి : దయారసము కురియు కనుల శ్రియఃపతిని లోకములకు
పట్టి ఇచ్చు రామానుజ పరమగురువు పరంజ్యోతి ॥దయా॥

చరణం 1 : ఏ మహాత్ముడిహపరముల నిచ్చుశక్తి గుత్తగొనెనా!
ఆ మహాత్ముడాదిశేషు నవతారమ్మై పుట్టెను
మాతలక్ష్మి పురుషకారమాన్యత నాశ్వీరదించ
శ్రీరంగము గోపురమున చెలగిపంచె తిరుమంత్రము ॥దయా॥

చరణం 2 : నిత్య సత్యమైన ప్రకృతి నిజముగ వేరొనరించును
జీవునిపై మాయగప్పి దేవునకా మాయతెరను
అష్టాక్షరరూపక మంత్రార్చనతో తొలగించిన
అందవచ్చు నదియె విశిష్టాద్వైతమ్మనె జియ్యరు ॥దయా॥

చరణం 3 : తిరుమంత్రము వలన పొందె చెరువు చేపలెల్ల ముక్తి
కలియుగ దైవము వేంకన కదలి సభకు నడచి వచ్చె
షణ్మతముల ఖండించిన రాణ్మతమై వైష్ణవము
చెలువొందగ పెంపొందగ జేసె భువిని ఉదయవరులు ॥దయా॥



# జయదేవుడు

పల్లవి : అష్ట పదుల హరి శిష్ట చరితము
పరమ మధురము - పాడెను జయదేవుడు ॥అష్ట॥

చరణం 1 : గీతగోవింద రీతుల పొంగే
భక్తి వేదాంత ముక్తి రసగంగ
కృష్ణ తత్త్వమును కూలంకషముగ
అందజేసెను అమరగానమున ॥అష్ట॥

చరణం 2 : మధురకవితలో మహిత మహర్షి
ఆదిశంకరుడె అతనికి సాటి!
లలిత మధురపద రాశికూటముల
వాగ్గేయకారులెవరో పోటి? ॥అష్ట॥

చరణం 3 : ధీర సమీరము యమునాతీరము
ప్రతిపదమందున పరిమళించగా
విశ్వమోహనము వేణునినాదమె
ఆయనమాట! ఆయనపాట! ॥అష్ట॥

# గోదాదేవి

పల్లవి : నీరాజయామి గోదే!
నిర్ణిద్ర భద్ర ముద్రే! ॥నీ॥

చరణం 1 : పల్లాండని తన యల్లుని గొలిచిన
పెరియాళ్వారుల ప్రేమ పుత్రిక
శ్రీభూనీళా చిన్మయ మాతృక
కవన సుధారస గంగామాలిక ॥నీ॥

చరణం 2 : ఎంతమక్కువో! ఏరి ఏరి నీ
గళమున దాల్చిన తులసీమాల
వనమాలికి! పరవశమున వరుడై
ఎదపై నినురహి పొదువుకొన రాగ ॥నీ॥

చరణం 3 : కుడికొప్పున - నెక్కొను మహాభక్తి
తిరుప్పావు పాశురములు బాడిన
క్రమ గాంధర్వగాన విశారద!
వందనములు గొనుమా ఆండాళ్! ॥నీ॥



# మీరాబాయి

పల్లవి : మేరలు మీరిన కృష్ణ భజనమే
తారల దాటిన మీరా! ॥మేర॥

చరణం 1 : ఏ సతి మదిలో ఎగసిన ప్రేమ
శ్రీసఖు సఖునిగ స్వీకరించెనో
ఆ సతి ఆడెడి అందెల రవళిని
వేణుగానఝరి వేడుకసేయును ॥మేర॥

చరణం 2 : అలలు అలలుగా ఆపాదమ్ములు
అద్భుతరీతుల అంబర వీధుల
కృష్ణకీర్తనల కేళీ నటనలు
గుత్తులు గుత్తులు గ్రుమ్మరించును ॥మేర॥

చరణం 3 : ఉన్మత్తము భావము హృదయోద్గతి కృష్ణాయత్తము
పదపదమున గేయనాట్య పరిమళ సామ్రాజ్యమ్ములు
పాటిల నిలువెల్ల కాంతి పటలము విరబూయు సరణి
లోకపావనము మీరా రూపము అపురూపము ॥మేర॥

# సతీసక్కుబాయి

పల్లవి : స్వామి పాండురంగడని సర్వాంతర్యామి అని
సర్వవిధమ్ములనమ్మిన సతీసక్కుబాయి ॥స్వామి॥

చరణం 1 : ఎన్ని కష్టములో తల్లికి! ఎన్ని తీర్ల రాపిడులో
ఎన్ని ముండ్ల కంచెలో ఛేదించ మనఃప్రసవమును
ఎన్ని బాధలున్నా తానెన్నుకొన్న గాఢభక్తి
విడువనట్టి స్మరణశీల వినుత సుగుణజాల ॥స్వామి॥

చరణం 2 : ఇల్లెడు చాకిరి ఆపై ఎత్తిపొడుచు అత్తపోరు
మేదకుడై ఎపుడు పెదవి మెదపలేని పెనిమిటి
మెత్తదనము బ్రతుకులోన మొత్తముగా శూన్యమైన
సంకటముల రంగడే శరణు సక్కుబాయికి ॥స్వామి॥

చరణం 3 : తిరిగే తిరగలి పిండికి తిరిగినట్లె ఉండగా
ఉడికే అన్నము తిండికి ఉడికిపోవుచుండగా
అసలున్నా లేకున్నా అన్ని ఇల్లు నిండగా
భవజలధిని చేసె నడుముబంటి పాండురంగడు ॥స్వామి॥



# రామదాసు

పల్లవి : రామునికై బ్రతుకే నీరాజనముగ చేసిన
సార్థకనాముడు భద్రాచల రామదాసు ॥రాము॥

చరణం 1 : చిత్ర శిల్పమయమైన శ్రీరామాలయము
కట్టించెను గోదావరి కట్టమీద ఘనుడు
ఒక్క చేతిమీద ఏది లెక్కించని భక్తి
మహీజాని ధనముపెట్టి మయబ్రహ్మవోలె ॥రాము॥

చరణం 2 : చెక్కించిన ప్రతి శిల్పము చెక్కివేయ తనువు
చేయించిన ప్రతినగ గురిచేయ చిత్రహింస
వధ్యశిలను బడినను తనవరుస మార్చుకొనని
వరరామభక్త ప్రవరుడు రామదాసు ॥రాము॥

చరణం 3 : రాముని బంటులు ఎందరో! రాముడె బంటగుచు
రామదాసు చెరబాపగ లక్ష్మణునితో వచ్చె
ఎన్ని జన్మముల పుణ్యమొ ఎన్నగ తానీషా
కన్నులార గాంచెను గోపన్న పుణ్యమునను ॥రాము॥

# కబీర్‌దాసు

పల్లవి : బీరుపోని భక్తికి బంగారపు గని కబీరు
కూరిమి శ్రీరామదాసు గురుముఖ్యుడు కబీరు ॥బీరు॥

చరణం 1 : కులమతములు ఇనకులుని సేవల
కలుగవటంచును తెలియ జెప్పుటకు
కలిగినాడేమొ ఇల! రామతారక
కలిత మానసుడు ఘనుడు కబీరు ॥బీరు॥

చరణం 2 : రోమరోమమున రామనామమే
పలికే భక్తుడు భక్తవిశిష్టుడు
ఆయన కీర్తన అత్యద్భుతమై
అన్ని ప్రాంతముల ఆశ్వాసించెను ॥బీరు॥

చరణం 3 : క్రమ గంభీర కంజీర ధ్వని
కలుష సంఘముల దులిపివేయగా
దోహారీతుల జోహారించెను
రాగసుధారస రామతత్త్వమును ॥బీరు॥



# సంత్ తుకారాం

పల్లవి : అజస్ర సహస్ర అభంగములతో
పాండురంగని భజించె తుకారాం ॥అజస్ర॥

చరణం 1 : రంగరంగ శ్రీరంగరంగయని
అణువు అణువులో అంతరంగమున
పొంగి పొరలి తెరలు రంగభక్తిని
అమృత నాదమున అమరగానమున ॥అజస్ర॥

చరణం 2 : పారవశ్యమున పరిసరమ్ములను
ఆత్మబంధువుల అనుబంధములను
పరిగణింపని భక్తి - తుకారాం
పాండురంగయని పాడును ఆడును ॥అజస్ర॥

చరణం 3 : ధనకాంచనముల తరుణి సంగతిని
గడ్డిపోచగాగనెంచు నిత్యము
నిరతభక్తియే నిజమగు వంత
సంత్ తుకారాం సరిలేరెవ్వరు ॥అజస్ర॥

# క్షేత్రయ్య

పల్లవి : ముద్దుముద్దు భావముల మువ్వగోపాల
పదముల బాడెను భక్తిని క్షేత్రయ్య ॥ముద్దు॥

చరణం 1 : మువ్వలందియలు మ్రోయగ కరపద
భ్రమణములను పగడములను జిమ్ముచు
రాసలీల నీలమేఘ శకలము
వరరాగ సుధా వర్షము గురియగ ॥ముద్దు॥

చరణం 2 : భగవద్గీతను పలుకగా నున్న
పరమవేదాంత బాలగళమ్మున
ఊపిరులందిన ఓంకార నాద
మురళీగానము మోసులెత్తగా ॥ముద్దు॥

చరణం 3 : సింగారముగ త్రిభంగి కృష్ణుడు
భక్తకల్పకము భవనాశకుడు
వరబృందావన చర మందారుడు
భువనమోహనుడు స్ఫూర్తిదాతగా ॥ముద్దు॥



# త్యాగయ్య

పల్లవి : రార! కనకమయచేలయనుచు శ్రీరామభద్రు బిలిచిన త్యాగయ్య
నీలనీరద శుభాంగవర్ణన వినీతగీతముల చేసె కదయ్య ॥రార॥

చరణం 1 : ఆలాపనయే అంతరంగముగ
నిత్యస్మరణమె నిర్మలాత్మగా
దనుజహర్త కీర్తన వర్తనగా
ప్రతినిమిషము పరగెను త్యాగయ్య ॥రార॥

చరణం 2 : కష్ట సుఖమ్ముల కలిమి లేములను
కడు దుర్భర దుఃఖ పరిస్థితులను
ధర్మమూర్తి సీతాపతి గొలిచిన
ధన్యజీవి సత్యము త్యాగయ్య ॥రార॥

చరణం 3 : ఎవరిపాట మరణించిన బాలుని
మరల బ్రతికించి మహిమ చూపెనో!
అట్టి మహర్షి మహాత్ముడు త్యాగయ
మాయతెరల దిశమార్చిన ఘనుడయ! ॥రార॥

# అన్నమయ్య

పల్లవి : బ్రహ్మమొక్కటే పరబ్రహ్మమొక్కటే
బ్రహ్మమొక్కటే పరబ్రహ్మమొక్కటే
అని చాటిన అద్వితీయ భక్తుడన్నమయ్య
అని చాటిన అద్వితీయ భక్తుడన్నమయ్య ॥బ్రహ్మ॥

చరణం 1 : బ్రహ్మయైన బ్రాహ్మడైన బలుచండాలుండైనా
ఏనుగైన శునకమైన ఏజీవము ఐనా
అన్నిటిలో ఉన్న ఆత్మ ఆపరమాత్మేనని
దాచకుండ చాటిన ధన్మాత్ముడన్నమయ్య ॥బ్రహ్మ॥

చరణం 2 : కులమతముల నిరసించిన కూటస్థుడు అతడు
చాపకూటి మానవతను చాటిన ఘనుడతడు
హరిజనులను దేవాలయమందులోకి బిలిచి
సర్వసమత్వము చాటిన సహృదయుడు అతడు ॥బ్రహ్మ॥

చరణం 3 : తిరుమల శ్రీ వేంకటేశువర కీర్తనములను
వేలకొలదిగా చెప్పిన విఖ్యాతుండతడు
ఆముష్మికమే ఘనమని అక్కడనే ఆగక
సమసమాజ నిర్మాణము సలిపె ఆన్నమయ్య ॥బ్రహ్మ॥



# తులసీదాసు

పల్లవి : రామచరితమానస! రసరాగహృదయసారసా!
పరమభక్తి వికాసా! వరతులసీదాసా! ॥రామ॥

చరణం 1 : చిన్నతనము నుండియు బోల్ శ్రీరామా రామ రామ్
రామ రామ రామయనుచు రాజిల్లిన రాంబోలా!
భార్యామణి రత్నావళి భావనలో నిరంతరము
లీనమైన ప్రేమైకలీలా సంభావనా! ॥రామ॥

చరణం 2 : తాడనుకొని పాముబట్టి తనకోసము మేడనెక్కు
పట్టరాని పతిప్రేమకు పరవశించి పరమసాధ్వి
ఎందుకింత మమకార మిదేమిస్వామి నామీదను?
రాముపైన నిలుపు మన విరాగివైన తులసీ! ॥రామ॥

చరణం 3 : ఉత్తరభారతమే కాదు ఒనర సర్వ భారతము
రామ చరితమానసకృతి రంజిల్లును సతతము
నీ – దోహాలను నిత్యము నెమ్మది మెచ్చిన జనము
మననము సేయును పాడును మరిమరి సంతసము ॥రామ॥

# తరిగొండ వేంగమాంబ

పల్లవి : ముత్యాల హారతులను మోదమున దినము దినము
తిరువేంకటేశు గొలిచె తరిగొండ వేంగమాంబ ॥ము॥

చరణం 1 : –ఆ ఆదిలక్ష్మివంటి ఆండాళుకు సరిసాటి
కలియుగము స్వామి జేరి తులసీదళాలమాల
ప్రతిదినము సమర్పించె పతిదేవుడనుచు తలచి
అతి భక్తి త్రికరణముల అలివేణి వేంగమాంబ ॥ము॥

చరణం 2 : అలనాటి అన్నమయ్య ఆదర్శమగుచుతోచ
తిరుమలేశ్వరుని బాడె దివ్య ప్రబంధములను
వేంకటాద్రి మాహాత్మ్య వృత్తాంతకృతిని పతికి
అంకితము జేసి యలరె అతిధన్య వేంగమాంబ ॥ము॥

చరణం 3 : పలుగాకి ముక్కువంటి ప్రజ సేయు బాధలోర్చి
ఘనబంధు వర్గములును తనుబెట్టు పీడసైచి
పరమాత్మభావమొకటె పరమార్థమనుచు మెలగి
చరితార్థయయ్యె భువిని తరిగొండ వేంగమాంబ ॥ము॥



# పుండరీకుడు

పల్లవి : పాండురంగని సేవకన్నను పరమ పుణ్యము తల్లిదండ్రుల
పాదసేవనమనుచు మెలగుచు పరిఢవిల్లెను పుండరీకుడు
॥పాండు॥

చరణం 1 : ఎవని సన్నిధిచేత భీమానదియలలు చుంబించె దివిని
ఎవని వర్తనమెచ్చి రంగడె ఇంపుగా వెంచేసె భువిని
ఎవని పేరిట రంగనాథుడె ఇలను పండరినాథ విఠలుడో
ఎవని పాదము సోకి పండరి పురము పావన మయ్యెనో
॥పాండు॥

చరణం 2 : పట్టపగ్గాల్ లేని వయసున భామినులె సర్వస్వమనుచును
కన్ను మిన్నును గనని కామము కాలు నిలువగనీక త్రిప్పగ
దుష్ట పాతకరీతి చెలగిన దుర్మదము సైతమ్ము పితరుల
పాదసేవనచే పటాపంచలగునని చాటె చిత్రము! ॥పాండు॥

చరణం 3 : ఎవని మాటల నెవని పాటల నెసగె నాట్యమ్ములను విఠలుడు
ఎవని కోరిక ప్రభువు వేణువు ఏతమెత్తెను రాగజలధికి
ఎవని యునికిని భీమనది విలసిల్లె యమునా తరంగిణియై
అతడె రంగని మెప్పులందిన అద్వితీయుడు పుండరీకుడు
॥పాండు॥

## పురంధరదాసు

పల్లవి : పారమార్థవిద్వేషి పరమలోభ కఠినమతి
నవకోటి నారాయణ నామ పురంధరదాసు ॥పా॥

చరణం 1 : నవనిధులే విధియని తెగనమ్మినవాడు
ఎన్నొ చేసి కోట్లకు పడగెత్తినవాడు
పైసలోనె ప్రాణము బిగబట్టినవాడు
దినవెచ్చమ్మునె లెక్కతొ దిద్దెడివాడు ॥పా॥

చరణం 2 : సాధ్వీమణి అతని పత్ని సరస్వతీబాయి
పుణ్యవతిని సుగుణమతిని పూని పరీక్షింప
తరలిరాగ విఠ్ఠలునికి తన ముక్కరనిచ్చి
సతిగెలిచిన సన్మతితో పతియు మారిపోయె ॥పా॥

చరణం 3 : పెన్నిధులన్నియు పంచిపెట్టెను పేదసాదలకు దానకర్ణుడై
పూనిక-విఠ్ఠల పాండురంగ పురంధర విఠల పాండురంగ
పాండురంగ పాండురంగ పండరినాథ పాండురంగ
అని ఎన్నో పదములను పాడుచు అర్చనజేసె పురంధరదాసు
॥పా॥



## సూరదాసు

పల్లవి: : అంధత్వము కన్నులకే అంతరాత్మ కదిలేదని
అరసి చూపి హరికీర్తనలల్లె భక్త సూరదాసు ॥అం॥

చరణం 1 : కంటి వెలుగె లేక ఎటుల కన్నయ్యను గాంచగలిగె?
పట్టరాని భక్తినేమొ పుట్టుగ్రుడ్డి సూరదాసు!
అతని వన్నెలతని చిన్నెలతని హావభావములను
అతని ఆటపాటలను అలరిపాడె సూరదాసు ॥అం॥

చరణం 2 : మధురలోన పుట్టుటనో మధుర మధుర మధురముగా
మధురాపురి వేణుగాన మహితుని వర్ణనలు చేసె
వర యమునాతీరవ్రజ భామినీ మనోవిభుని
పరిపరి విధముల బొగడెను వ్రజభాషను సూరదాసు ॥అం॥

చరణం 3 : శ్రీవల్లభ శిష్యత్వము శ్రీవల్లభునెరుక దెలుప
సూరసాగరము రచించె చూపులేని సూరదాసు
అంతశ్చక్షువు చక్షువు కన్నమిన్నయని చాటెను
అంతర్ముఖుడై శ్రీహరి నంతటగని సూరదాసు ॥అం॥